# విజయా వారి "మిస్సమ్మ" సమీక్ష

విజయవారి "మిస్సమ్మ" చక్కని కామెడీ చిత్రం హాస్యం, వినోదం ప్రధానంగా పెట్టుకుని ఈ చిత్రం నిర్మించబడింది ఎన్ టి రామారావు, సావిత్రి, జమున, నాగేశ్వరరావు, రంగారావు, రేలంగి, రమణారెడ్డి, ఋష్యేంద్రమణి, దొరస్వామి మున్నగువారు నటించారు ప్రసాద్ గారు డైరెక్ట్ చేశారు చక్రపాణిగారు సంభాషణలు రచించారు పింగళి నాగేంద్రరావుగారు పాటలు వ్రాశారు సాలూరి రాజేశ్వరరావుగారు సంగీతం సమకూర్చారు అనుభవశాలురైన విజయవారి టెక్నీషియన్లు చిత్రానికి వన్నెలు తీర్చిదిద్దారు వీటన్నిటితో "మిస్సమ్మ" మంచి చిత్రంగా తయారైంది

ఒక జమీందారు పదిహేనేళ్ళ క్రితం తప్పిపోయిన తన పెద్దకూతురై పేర ఒక ఎలిమెంటరీ స్కూలు పెట్టించి దాన్ని నడపడానికి బి ఏ చదివిన దంపతులు కావాలని ప్రకటించడం, మిస్ మేరీ, రావు అనే ఇద్దరు యువతీ యువకులు తాము భార్యాభర్తలమని అబద్ధమాడి ఆ ఉద్యోగాలు సంపాదించడం, చివరకు వారిద్దరూ భార్యాభర్తలు కావడం, మిస్ మేరీ ఇదివరలో తప్పిపోయిన జమీందారుగారి కుమార్తె అని బయటపడ్డం జరుగుతుంది ఈలోగా ఒకరి నొకరు ప్రేమించుకున్న రావు, మిస్ మేరీ చిత్రం అంతంలో వివాహమాడి నిజంగా దంపతులవుతారు

ఈ కథలో మిస్ మేరీ జన్మతః హిందువుల పిల్ల అయినా, తలిదండ్రులనుండి తప్పిపోయి క్రైస్తవుల యింట్లో పెరుగుతుంది క్రైస్తవ మత వాతావరణంలో పెరిగిన ఆమె ఉద్యోగనిమిత్తం హిందూ సతిగా నటించవలసిన అగత్యం ఏర్పడుతుంది హిందువుల ఆచారాలు, అలవాట్లు ఆమెకు రుచించవు వాటిని అసహ్యించుకొంటుంది క్రైస్తవమతమే అన్నిటికంటె గొప్పదని భావిస్తుంది కాని చివరికి తాను నిజంగా హిందువుల పిల్లయేనని తెలుసుకుని మతాలకంటె మానవత్వమే గొప్పదని గ్రహిస్తుంది. అంతేకాక రావు మంచితనం చూసి అతన్ని ప్రేమిస్తుంది ప్రేమకు మతభేదాలు అడ్డం రావని, మతవిశ్వాసాలెటువంటివైనా సంఘజీవనానికి అడ్డురాగూడదనీ ఈ పాత్ర ద్వారా కథా రచయిత నిరూపించారు

నేటి కాలపు నిరుద్యోగ సమస్య కథలో ప్రధానాంశమైనా, దానిని మామూలు ధోరణిలో కాకుండా హాస్యధోరణిలో ఉపయోగించుకొన్నారు రచయిత మొదటినుంచి చివరదాకా హాస్యమే ప్రధానమై ప్రేక్షకులను వినోదింపజేస్తుంది ఈ హాస్యం సన్నివేశాలలోనూ, సంభాషణలలోనూ



రాగిణీవారి "అర్ధాంగి" లో సురభి బాలసరస్వతి, జగ్గయ్య మున్నగువారు.



బొంబాయిలో "హామ్లెట్" హిందీ చిత్రం విడుదలఅయిన సందర్భంలో నిర్మాత - దర్శకుడు - నటుడు కిశోర్ సాహూ, ఒఫీలియాగా నటించిన మాలాసిన్హా, ఫోటోగ్రాఫరు కపాడియా.

## ★ "మిస్సమ్మ" సమీక్ష ★

కూడా సాధించబడింది. ఆక పాత్రల సంగతి చెప్పనే అక్కర్లేదు. విజయావారి చిత్రాలన్నిటిలోనూ పాత్ర సృష్టి విచిత్రంగా వుంటుంది. సజీవములైన పాత్రలున్న చిత్రం రాణించినట్టుగా మరొక చిత్రం రాణించదు. ఉత్తరాలు తిరిగిస్తే పాత్రీకరణం సిద్ధిస్తుందనే సూత్రంతో తయారైన చిత్రాలు తెలుగులో బాగా వున్నాయి. కేవలం ఊహాపదాల మీదనే ఆధారపడకుండా వ్యక్తిత్వం కలిగిన పాత్రలను సృష్టించడం విజయావారి పద్ధతి. "మిస్సమ్మ"లో మిస్ మేరీని పెళ్లి చేసుకోవాలని తాపత్రయపడే డేవిడ్ అచ్చంగా క్రిస్టియన్ యువకునిలా కనిపిస్తాడు. ప్రతిదానికి వగ్గిరా డబ్బుపిండే సోమరిపోతు బిచ్చగాడు దేవయ్య, ఆంధ్రా షెర్లాక్ హోమ్స్ రాజు కూడా ఇలాంటి వ్యక్తిత్వంకల పాత్రలే. అతి గారాబంవల్ల వయస్సుతోబాటు మనస్సు వికసించని పిల్లలకు ఉదాహరణ జమీందారు రెండో కూతురు సీత.

ఎన్. టి. రావుమీద అంతవరకూ అజ్ఞాతమైన ప్రేమతో వున్న మిస్ మేరీ అతడు సీతను ప్రేమిస్తున్నాడని భ్రమపడి, కెల సీతతో ఘాటపడి చివరకి ప్రేమను బహిర్గతం చేసుకొంటుంది. ఇక్కడ కథారచయిత నేర్పు బాగా కనిపిస్తుంది. అదే విధంగా డిటెక్టివ్ రాజు కూడా తన మేనమామ కూతురు సీత మిస్టర్ రావును ప్రేమిస్తోందని సీతతో ఘాటపడి ఆమెను తిరగా వేసుకోడానికి ప్రయత్నిస్తాడు.

రాజేశ్వరరావుగారి సంగీతం ఆహ్లాదకరంగా వున్నది. "బృందావనమది అందరిదీ" అనే పాటలో రాజేశ్వరరావుగారు ప్రతంగా వస్తున్న ఏదో ట్యూనును చాలా చక్కగా ఉపయోగించుకొన్నట్టు అనిపించింది. ఆ పాట పాడుతున్నది జమున. నృత్యాలు చక్కగా ఉన్నాయి. మిస్సమ్మగా సావిత్రి, రావుగా ఎన్. టి. రామారావు బాగా నటించారు.

ఈ చిత్రానికి బెంగాలీలో రవీంద్రనాథ మైత్రా వ్రాసిన ఒక నాటకం అతివ్యక్తం చాలవరకూ ఆధారమైనది. "ఉదరనిమిత్తం" అనే పేరుతో యీ నాటకాన్ని శ్రీ చక్రపాణిగారు ఇదివరలో తర్జుమాచేశారు. అయితే ఆ కథకు చాలా మెరుగులు పెట్టి, అందులో లేనివి కొన్ని చేర్చి యీ చక్కని చిత్రం తయారుచేశారు. మిస్ మేరీ చిన్నప్పుడు తప్పిపోయిన పిల్లకావడం ముఖ్యమైన మార్పు. ఈ మార్పువల్ల కథకు మంచిబలం చేకూరింది. మిస్ మేరీమీద జమీందారు దంపతులు చూపించే 'ఆ' అనురాగానికి ఆమె వారి కుమార్తెయైన కారణం బాగా ఉపకరించింది. పైగా ఆమె హిందువుల పిల్ల కావడానికి ఆమె క్రైస్తవయువతి అని అనుకొని వీర్పరచుకున్న మతవిశ్వాసాలకూ వైరుధ్యం ఆ పాత్ర ప్రయోజనాన్ని మరింత దృఢంచేసింది. ★